# ఖమ్మంలో నిరాకృతమైన నిమ్న జాతుల అభివృద్ధి తీర్మాన మామోదించబడుట

## సిరిసిల్ల ఆంధ్రమహాసభ నాల్గవ సమావేశము

మొదటిపేజీ తరువాయి

హిందూమతాభివృద్ధికి ముఖ్యములని తెలిపియున్నారు. ఇట్లే భారత ప్రముఖులనేకులు నుడివియున్నారు.

ఇర్విను ప్రభువుగారును శారదాచట్టము మతేతరమని స్పష్టముగానిర్ణయించి యుండలేదు. వైద్యశాస్త్రమునందు యెచటను బాల్యవివాహములు ఆరోగ్యమునకు భంగకరములని చెప్పబడిలేదు. గర్భాధానము మాత్రము బాలికలకు ౧౬ సంవత్సరములకు పూర్వము, పురుషులకు యిరువదియైదు సంవత్సరములకుపూర్వము చేయగూడదని చెప్పబడియున్నది. జోతిశ్శాస్త్రముగూడ బాల్యవివాహములనే ప్రోత్సహించుచున్నది. ఈయన్ని కారణములచేతను యీ తీర్మాన మంగీకారయోగ్యముగా లేదు. కావున మీరందరీ తీర్మానమునకు వ్యతిరేకముగా వోట్లనొసగెదరుగాక యని కోరుచున్నాను.

శ్రీ మాడిరాజు రామకోటేశ్వరరావుగారు ప్రతిఘటనను బలపరచుచు మత విషయములకు సంబంధించిన యేతీర్మానమునుగూడ యిట్టిమహాసభలలో ప్రవేశ పెట్టబడగూడదనియు, ౧౩౦౫ ఫసలీలో ప్రభుత్వమువారు మతవిషయములలో ప్రభుత్వము జోక్యము కలిగించుకొనగూడదని స్పష్టపరచినారనియు, భారతదేశమునందు శారదాశాసనము అమలులోకి వచ్చుటకు కొరకులు యువకులేయనియు, యీమహాసభలోగూడ ఈతీర్మానమును అంగీకరింపజేయుటకు యువకులే కృషిసలుపుచున్నారనియు (యువకులలో యుత్సాహము, సంతోషముతో కూడిన కరతాళధ్వనులు చెలరేగెను) యువకుల పలుకుబడికి, యుత్సాహములకులోనై మీరీ తీర్మానమును నామోదింపగూడదనియు నుడివిరి.

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు న్యాయిరేకుల యుపన్యాసములకు ప్రత్యుత్తర మొసగుచు యువకులు వేదములను, ధర్మశాస్త్రములను ధిక్కరించుచున్నారని అపోహకల్పించి మీఅభిప్రాయమును వారిపై జూచుచున్నారనియు, వేదములపై యువకులకుగల గౌరవము, అభిమానము యితరుల కెవరికిని లేదనియు, వారువేదములను తమశిష్యులపై మోపుకొనుచున్నారనియు, నేడుభారతదేశమునందు శారదాశాసనమును అందరును అమలులోనికి తెచ్చుచున్నారనియు, ఆర్యప్రముఖులును, విశ్వదాసులును, దేశోద్ధారకులునగు శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులు దేవనిమారైన ౧౬ సంవత్సరములకు వివాహము గావించినపుడు విఖ్యాత పండితులందరును విచ్చేసియుండిరనియు, తెలిపిరి.

వోట్లుగైకొను సమయమున సభలో కొంత [illegible] కలిగెను. కొన్ని అభ్యంతరములు, సవరణలును, పోగ్యదన్యులయుక్తులు [illegible] మపై [illegible] దాఖలాయెను. తీర్మానమునకు వ్యతిరేకముగా [illegible] తీర్మానము [illegible] కారణముగా ఆమోదింపబడెను సభయందు సుమారు ౧౫ నిమిషముల కాలము [illegible] నములు మిన్నుముట్ట మారుమ్రోగెను.

### తెలంగాణా రైతు

తెలంగాణా రైతులకు యెటువంటివలసిన సౌకర్యములనుగూర్చిన తీర్మానమును ప్రవేశపెట్టుచు శ్రీమంతులగు నరసింగరావుగారు జేరుబావులీచే సేద్యపడుచున్న పంటలకు వటీధారాసైకొన గడుచున్నదనియు. చెరువునీటిచే సేద్యము గావించు సమయమున రైతులకు అధికకష్టము లేదనియు, బావినీటిచే సేద్యము గావించువారు దైవయుక్తప్రయాసలకులోనగుచున్నాడనియు, ఐదను చెల్లించువారు మాత్రము కొద్దిపాటిభేదమే గలదనియు, అందుచేతబావులీపనులకు సెకీధారాతీరువా గూడదనియు, ఈసమస్య చాలకాలమునుండి ప్రభుత్వము వారి యాలోచనయందున్నను నేటివరకును రైతులకు అనుకూలముగా పరిష్కారము కాలేదనియు, ఈవిషయమున్వరలో ప్రభుత్వమువారు పరిష్కారము గావింపవలయుననియు, వ్యవసాయపు పనిముట్లనుగూర్చి ప్రభుత్వమువారు సదుపాయములను గలుగజేయవలయుననియు, పశువులకుమేత లభించుసౌకర్యములను గలుగజేయవలయుననియు, పంటచెరకులు మొదలగువానికి అటవీశాఖవారి అటంకములు తొలగించవలయుననియు. ప్రస్తుతము అటవీశాఖవారు కలిగించుచున్న అటంకముల వలన రైతులు పశువులమేతను విడుదలచేసుకొనుచుండుటచే భూమికి ఎరువులేక నిస్సారమై పోవుచున్నదనియు, పంటలుదినదినము తగ్గుచున్నవనియు నుడివిరి.

శ్రీ ఎల్లారెడ్డిగారు తీర్మానమును బలపరచిన పిమ్మట యేకగ్రీవముగా నంగీకరింపబడెను. తీర్మానము దిగువవిధముగా గలదు:—

"తెలంగాణా రైతులకుగల ప్రత్యేక పరిస్థితులను దృష్టిలోనుంచి యీక్రింది అనుకూలములను కలిగించుటకై యీమహాసభవారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు —

౧. జేరుబావులీ తరీపన్నులను తీసివేయుట.

౨. వ్యవసాయపు పనిముట్లను అనగా కర్రలు, త్రాళ్లు మొదలగువానిని గురించి సదుపాయములు కలుగజేయుట.

3. పశువులమేత సంబంధమైన అనుకూలములు కలిగించుట.

౪. వంటచెరకులు, మొదలగువాటికై అటవీశాఖవారి అటంకములు తొలగించుట."

### బలోతాదారుల కష్టములు

బలోతాదారుల కష్టముల నివారణగావించుటకై కోరుచట్టి దిగువతీర్మానము శ్రీయుత నరసింహారావుగారిచే ప్రవేశపెట్టబడి శ్రీ హనుమయ్య చౌదరీగారిచే బలపరుపబడి యేకగ్రీవముగా అంగీకరింపబడెను:—

"గ్రామములలోని బలోతాదారుల బాధ్యతలను సర్వేశాఖామును పూర్వము చేసినట్లు, దివానీ యిలాకాలో సహితము స్పష్టపరచుచు క్రింది అధికారులపేర హుకుములు జారీచేయుటకై తృతీయాంధ్ర మహాసభలో చేయబడిన విజ్ఞాపనముపైన ప్రభుత్వమువారిదృష్టిని మరల నాకర్షించుచు యీవిషయమున గట్టియేర్పాటులుచేసి నోరులేని గ్రామపు పేద బలోతాదారులను జులుమునుండి తప్పింప ప్రభుత్వమువారిని యీమహాసభవారు ప్రార్థించుచున్నారు"

పిమ్మట అధ్యక్షస్థానమునుండి దిగువ తీర్మానములు ప్రవేశపెట్టబడి యేకగ్రీవముగా అంగీకరింపబడెను:—

### రైల్వే ప్రయాణీకుల యిబ్బందులు

నిజాంస్టేటు రైల్వే ప్రయాణీకుల సౌకర్యముకొరకు యీక్రింది యేర్పాటులను చేయుటకై యీమహాసభవారు రైల్వేశాఖవారిని కోరుచున్నారు:—

(అ) మూడవతరగతి బండ్లలోని కక్కుసులను జి. ఐ. పి. బండ్లలోవలె నిర్మించి ప్రతిజంక్షను స్థలములోను వానిని శుభ్రముచేసి నీరునింపు యేర్పాటులను జరుపవలెను

(ఆ) ఇప్పటి మూడవతరగతి డబ్బాలకు ఒకటిరెండు దర్వాజలుమాత్రే యున్నందున ప్రయాణీకులకు కష్టమగుచున్నది కావున పూర్వమువలె దర్వాజ లెక్కువగానుండునట్లును, ఎత్తులేని అడుగులుండునట్లును, చేయవలెను.

(ఇ) మూడవతరగతి బండ్లలో నిర్ణీతసంఖ్యకంటె ఎక్కువమందిని యెక్కింపగూడదు

(ఈ) ఇంటరు క్లాసు డబ్బాలను యేర్పరుపవలెను.

(ఉ) రెండవతరగతి బండ్లను అవకాశమును మించి కట్టివేయ వలదు.

### స్థానికస్వపరిపాలనము

"హైదరాబాదు నగరములో పురపాలకసంఘమును క్రొత్తపద్ధతిన స్థాపించినట్లు, ప్రతిజిల్లాయందును స్థానికస్వపరిపాలన పద్ధతిని ప్రవేశపెట్టుట ఆవసరమని అభిప్రాయపడుచు తగు చర్యలను గైకొనుటకై ఈమహాసభవారు ప్రభుత్వము వారిని ప్రార్థించుచున్నారు."

### నిమ్నజాత్యుద్ధరణ

"రాష్ట్రములోని నిమ్నజాతుల విద్యాభివృద్ధికై మ.ఘ.వ. నిజాం ప్రభుత్వము వారవలంబించిన విధానమునకు యీమహాసభవారు తమకృతజ్ఞతను తెలుపుచు ఆజాతులవారి విద్య, పరిశుభ్రత, సౌజన్యాదుల పెంపొందించి వారికష్టముల తొలగించుటలో సర్వజనుల తోడ్పడవలయునని దేశీయులను ఈమహాసభవారు ప్రార్థించుచున్నారు."

### వెనుకటిమహాసభల తీర్మానములు ధృవపరచుట

గతమహాసభల యందంగీకరింపబడి యుండిన ఈక్రింది తీర్మానములను యీమహాసభవారు మరల ధృవపరచుచున్నారు:—

ప్రథమ మహాసభ

ద్వితీయమహాసభ

తృతీయమహాసభ

పగలు ౧౨ గంటలకు సభసమాప్తమయ్యెను:—

[సశేషము]

## మన శాసన సభలో న్యాయవాదుల ఎన్నిక

ఇంతవరకు ఆంధ్ర ప్రతినిధి లేని కొరతను తీర్చవలసిన అవసరము

హైదరాబాదు రాష్ట్రములో శాసనసభ ఏర్పడి [౩౦] సంవత్సరములైనది. ప్రస్తుతము అమలులోనున్న శాసనము ప్రకారము ఉద్యోగేతర సభ్యులు [౮] గురు ఇందులో సర్కారుచే నియమించినవారు పోగా మిగత [౮] సభ్యులుమాత్రము ప్రత్యేక సంఘముల వారికి ఓటుగా ఎన్నుకునే అధికారముగలదు. ఈ అధికారము ప్రకారము న్యాయవాదివృత్తిని చెందిన వారికి మొదటినుండి న్యాయవాదులకు తమలో నిర్ధరించి శాసనసభకు పంపుటకు అధికారమున్నది. ప్రతిరెండు సంవత్సరముల కొకసారి ఆ స్థానములో ఎన్నికలు ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు) లో జరుగుచున్నవి. నేటివరకు శాసనసభా సభ్యత్వము న్యాయవాదులపక్షమున ఒక ఆంధ్రునికైనను లభించలేదు. ఏదేని ఒక సంఘమునకుగాని, జాతికిగాని పరిపూర్ణగౌరవము, ఔన్నత్యము కలుగవలెనన్న ప్రతివిషయములో ఇతరులతోపాటు సరిసమానముగా ముందంజ వేయవలెను. తమ యోగ్యతను నిలబెట్టుకొని జాతీయ గౌరవమును కాపాడవలెను. ఇది ప్రతి జాతి న్యాయముగలవిధి.

ఈ గౌరవమునకు అర్హులైన ఆంధ్ర న్యాయవాద ప్రముఖుల నెందరినో పేర్కొనవచ్చును. హైదరాబాదులో అతిప్రఖ్యాతులైన న్యాయవాదులలో శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారొకరు. వీరు ఎన్నియో ప్రజాహిత సంస్థలలో పనిచేయుచున్నారు. వీరు ఎన్నియోక్లిష్ట పరిస్థితులలో తమ సదభిప్రాయములను ఇచ్చి వానినన్నిటిని చాలా జాగ్రతగా చక్కపరచినారు.

ద్వితీయాంధ్ర మహాసభకు, అధ్యక్షులుగానున్నపుడు సభను చాలా జయప్రదముగా జరిపిరి. ఖమ్మము తృతీయాంధ్రమహాసభ సందర్భమున స్థానికపరిస్థితులననుసరించి చిక్కులు కలిగినపుడు చాలా ధైర్యముతో కార్యభారమును వహించి చక్కగా సభ జరిపిరి. హైదరాబాదు పురపాలకసంఘమునకు ప్రజల తరఫున ఎన్నుకోబడి అత్యంతశ్రద్ధతో తమ కర్తవ్యములను నెరవేర్చుచున్నారు. వీరి యోగ్యతకు ఒక ఆంధ్రులేకాక, యావత్తు హైదరాబాదురాష్ట్రీయులు, గర్వపడవలసియున్నది.

ఇంకొ ఎందరో మహాశయులుగలరు. వ్యాసవిస్తరభీతిచే ఇంకొకరిద్దరి పేర్లు మాత్రము ఉదహరించి విరమించుచున్నాను. శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డిగారు [౨౫] సంవత్సరములనుండి న్యాయవాది ధర్మమును చాలా చక్కగా నెరవేర్చుచు. ఆవృత్తికి గౌరవమును కలిగించినారు. గొప్ప ఉదారులు. ప్రజాసంస్థలన్నిటికి అత్యంత ఉదారబుద్ధితో సహాయము చేయుచున్నారు. నిరాడంబరజీవులు.

శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారి విషయములో ఎక్కువగా చెప్ప అవసరమే లేదు. వీరు [౨౫] సం॥ల క్రిందట ఆంధ్రోద్యమమును బయలుదీసి, చెక్కుచెదరని స్థిరసంకల్పముతోను, అదమ్యప్రాయముగా కృషిసలుపుచున్నారు. హైదరాబాదు పురపాలక సంఘ సభ్యులు—నుండి చాలా చక్కగా తమ కర్తవ్యమును నెరవేర్చినారు.

నిజాంరాష్ట్రాంధ్రభూమి ఇటువంటి పుత్రరత్నముల ఎందరినో కలిగియుండికూడ ఇదివరకు వారిలో ఎవరును న్యాయవాదుల తరఫున శాసనసభా సభ్యత్వమునకు అభ్యర్థిగా నిలిచి సభ్యులు కానందున, చాలా చిన్నబోయియున్నది ఇప్పుడైన ముందుకువచ్చి ఆంధ్రుల కొరతను తీర్తురని ఆంధ్రమాత నిరీక్షించుచున్నది. యావద్రాష్ట్రీయ న్యాయవాద సంఘముతోను తనపుత్రులకు ఈ అవకాశము లభింప చేయుమని మొరపెట్టుచున్నది. కాన ఈవిషయమును న్యాయవాద మహాశయులందరు, ఆదరణతో గమనించి, పాటించెదరని నమ్ముచున్నాను.

ఒక ఆంధ్రుడు.

## ఆవుపేడతో ఆరోగ్య రక్షణము

పాశ్చాత్య నాగరికతా వ్యామోహములో దేశీయులు క్రమక్రమముగా ప్రాచీన దేశీయాచారములను దూషించుచు, వదలిపెట్టుచున్నారేకాని, అవినిజముగా నష్టకరములా లాభకరములా అని విచారించుటలేదు, అట్టి ఆచారములలో ఒకటి వాకిళ్లలో పేడనీరు చల్లుట, యింటిలో నేలను పేడతో అలుకుట ఇప్పుడు పేడతో పెట్టుట నాగరికతకు లోటని తలచెదుచున్నవి. కాని, నిజముగా, మన పూర్వుల ఆచారము ఆరోగ్య రక్షకమని నవీనవైజ్ఞానిక పరిశోధనల వలన తెలియుచున్నట్లు యం. ఏ. రామచంద్రరావు గారు "టిపొటీఫ్రా" అనుపత్రికలో తెల్పుచున్నారు మానవునికి ఉపద్రవకరములగు సూక్ష్మక్రిములను సంహరించుటయందు ఆవుపేడకు అద్భుతమైన శక్తి కలదనియు, యీ ఆచారమును యిటువంటి యితరములగు లాభకరములైన ఆచారములను పాటించుట వల్లనే మన పూర్వులు ఆరోగ్యవంతులుగ చిరకాలము జీవించగలిగిరనియు వారు తెల్పుచున్నారు. ఈ ఆరోగ్య రహస్యములు అందరికిని విశదముగా తెలియవుగనుక వాటిని మతధర్మములుగా నిబంధించిరని వాదించుచున్నారు.



గోలకొండపత్రిక
యువనామ సం॥ పౌష్య బ ౫
సోమవారము

# ప్రజాపక్ష విద్యా మహాసభ

ప్రజాపక్షవిద్యామహాసభయొక్క తృతీయసాంవత్సరిక సమావేశమును యెట్టిఆటంకములు లేకయే జరుపుకొనుటకు ప్రభుత్వమువారు అనుమతించినందుకు సంతోషించెదము. ఇదియంతయు క్రొత్త విద్యాశాఖామంత్రియగు నవాబ్ మెహిదీయార్ జంగ్ గారి అధికారకాలమున విద్యావిషయమైనాలనావిధానము (Policy) లో క్రొత్త ఉదారభావమునకు సూచనయని నమ్మనిచ్చును. ప్రజాపక్ష విద్యామహాసభా స్థాయిసంఘ కార్యదర్శి గతసంవత్సరములో నవాబ్ మెహిదీయార్ జంగ్ గారిని దర్శించి, కళాశాలా విద్యాభిలాషులకు అనేకులకు యిపుడున్న కళాశాలలలో యీసంవత్సరము స్థలముచిక్కని విషయమును గూర్చి ప్రస్తావించి, ఆవిషయమై క్రొత్త నవాబ్ వారు సుగూర్చి ముచ్చటించియుండిన సంగతి పాఠకులకు తెలిసియేయుండును.

కళాశాలా విద్యాభిలాషుల సంఖ్య పెరుగుచుండుటచే యిపుడుండు కళాశాలలలో వారలకు స్థానము చాలకుండుట నిజమేనని నవాబ్ గారు అంగీకరించిరి. ఇపుడుండు కళాశాలలను విస్తరించిగాని, క్రొత్త కళాశాలలను స్థాపించిగాని సహాయము చేయవలసిఉదను సూచనకు ప్రస్తుతస్థితిలో ప్రభుత్వమువారు అందుచే అగువ్యయభారాధిక్యమును భరించ లేరనుచు, క్రొత్త విద్యాలయముల స్థాపించుటకై ఆస్తిప్రయత్నములు చేయబడుచో ప్రభుత్వమువారు సానుభూతితో చూడగలరనిరి. కాని, ఆస్తిప్రయత్నములకు ప్రజలసానుభూతి అవసరమనియు, అట్టిసానుభూతిని సంపాదించుటకు సభలే సులువైనసాధనమనియు చెప్పి ఈ మహాసభ జరుపుటకు జమానతు చెల్లించవలసినవసరములేకుండ ప్రభుత్వమువారు అనుమతీయవలసిన అవసరమును ప్రజాపక్షవిద్యామహాసభా స్థాయిసంఘ కార్యదర్శిగారు సూచించగా మెహిదీయార్ జంగ్ గారు అసూచన విషయమై ప్రభుత్వమువారిని మరియొకసారి ప్రార్థించుచో సద్భావముతో ఆలోచించబడునని మాటయిచ్చి, యిప్పుడట్టి సద్భావమును నిరూపించినవారైరి.

కాబట్టి యిపుడు మహాసభను జరుపుటకు ఉత్సాహముతో ప్రయత్నములు చేయబడుచున్నవి. ఆహ్వానసంఘమేర్పడినది. అర్థిబెహాస్తులో సభను సమావేశపరుచుటకు నిశ్చయించబడినది. సమావేశమైనపుడు మహాసభవారు కళాశాలవిద్యాసౌకర్యముల హెచ్చించువిషయముతోపాటు- విద్యావిధానసంస్కరణవిషయమునుగూర్చిగూడ ఆలోచించి ఎట్టిపాఠ్యక్రమపద్ధతికిని బలమునొసగకరాష్ట్రములో అన్నిశాఖలవారి సుఖమైన విద్యాభివృద్ధికిని, నిరుద్యోగసమస్య పుట్టకుండ చేయుటకు ననుకూలమైనసంస్కరణ సూచనలనుగూడ తీర్మానించవలసిన అవసరముగలదు. మొకంజీకమిటీవారినివేదిక వెలువడులోపలనే యిట్టి సూచనలు ప్రభుత్వమువారికి తెలియుట ముఖ్యము.

# కాంగ్రెసు లోనికిమిత వాదుల చేరదీయు యత్నము

మొన్న మొన్న జరిగిన కాంగ్రెసు సువర్ణోత్సవసందర్భమున, కాంగ్రెసు అధ్యక్షులగు బాబు రాజేంద్రప్రసాదుగారు పూర్వమొకప్పుడు కాంగ్రెసులోనుండితమ్మాతతభిప్రాయభేదముల చేవిడిపోయిననాయకులతో యిష్టాగోష్ఠిసమావేశములుజరుపవలెననిసూచించిరి. దీనితర్వాత యిటీవలనె జనవరి ౨౧వ తేదికిముందు రైట్ ఆనరబిల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు మదరాసులో యిచ్చిన ఉపన్యాసములో కాంగ్రెసు దేశములో అన్నిపక్షాలకంటెను గొప్పపక్షమని క్రొత్త రాజ్యాంగశాసనములో దానికెంకరులను చేకూరగలదనియు, కాంగ్రెసు గెలుపున్నట్లు దేశీయులందరును యత్నించవలెననియు చెప్పుచు, కాంగ్రెసువారు యితరపక్షములనుండికూడా సాధ్యమైనంత సహాయము పొందవలెనని సూచించిరి. చిరకాలముగా శాసనోల్లంఘనము, భారతదేశము బ్రిటిషుసామ్రాజ్యమునుండి చీలిపోయిన స్వతంత్రదేశముగానుండవలెనను కాంగ్రెసువాదులఘోషలును, యిటీవల కాంగ్రెసుసభ్యుడగుటకు నిర్ణయింపబడిన నూలునూపమైనచందా, కాయకష్టము చేయవలెననుపరతున్న మితవాదులు కాంగ్రెసులోచేరుటకు అటంకములని చెప్పిరి. ఈసూచన పిమ్మట యిపుడు కాంగ్రెసు అధ్యక్షుడు త్వరలో మితవాదపక్షమునున్న ముస్లింలీగునున్న కాంగ్రెసులో చేరదీయుటకు యత్నించెదరని బొంబాయి క్రానికల్ పత్రికా విలేఖరికి తెలియుచున్నది. గాంధిమహాత్ముడు శ్రీనివాసశాస్త్రిగారినిత్సృప్తిపరచుటకుయత్నించుతురట. అంతేగాక ఢిల్లీలో అన్నిపక్షములును చేరి కర్తవ్యమును నిర్ణయించుటకై ఒక జాతీయమహాసభ జరుపవలెనని కొందరు నాయకులనుచున్నారట. ఇదిట్లుండ యింకొకకంక శాసనసభలలో మంత్రిపదవులను స్వీకరించరాదనువారందరును తమఅభిప్రాయములను ప్రచారము గావించుకొనుటకై ఢిల్లీలోనే సమావేశము కావలెనను ఒకసూచనయు చేయబడినది.

ఈరెండు వార్తలతో యిటీవల నేకొన్నిరోజులక్రిందట మౌలానాషౌకతాలీగారిచ్చిన వాఙ్మూలమును జోడించిచూచిన, సర్వపక్షములు నకాంగ్రెసుతో చేరుటకు వాతావరణము అంతకంతకు అనుకూల మగుచున్నట్లుతోచును. షౌకతాలీగారు తానుమరల కాంగ్రెసుతో చేరవచ్చుననియు, అందుకైమందుగాహిందూమహమ్మదీయ సఖ్యమునకై తీవ్రముగాయత్నించుచున్నాననియు చెప్పియుండిరి. వారుబాబూరాజేంద్ర ప్రసాదుగారిని కలిసిమాట్లాడియుండిరట.

ఈవివిధపక్షములను, ముఖ్యముగా మితవాదపక్షము, కాంగ్రెసులో చేరదలచుచో వారల ప్రధానదృష్టి మంత్రిపదవులపై యుండవచ్చుననియు, కోటిమున్నుందు శాసనసభలలో మంత్రిపదవి స్వీకార సమస్యకాంగ్రెసు చర్చలలోయెక్కువ ప్రాముఖ్యత వహించ గలదని యుఊహించ బడుచున్నది.

పూర్వపు కాంగ్రెసు అధ్యక్షులైనవారు కాయకష్టము లేకున్న నురాష్ట్రీయకాంగ్రెసు కమిటీలోను కాంగ్రెసుస్థాయి సంఘములోను వోటుహక్కులేని సభ్యులగుదురని రాజేంద్రప్రసాదుగారు తీర్పుచెప్పినారు.

## గాంధిమహాత్ముని అరోగ్యము

రెండువారములనుండి గాంధిమహాత్మునికి నెత్తురుపోటు యెక్కువగానుండెను. జనవరి ౧౫వ తేది వారిస్థితి చాలప్రమాదములో నున్నట్లు వారినిచూచివచ్చినవారు చెప్పిరి. కానితర్వాత అంతప్రమాదము లేదని తెలిసెను. ఆరోగ్యమ ధ్యానము మహాత్ముని సంగ్లురెండు లాగివేయబడినవి. అటుపిమ్మట నెత్తురుపోటు తగ్గినట్లు తెలిసినది. అపండ్లు పుచ్చిపోవుటచేతనే నెత్తురుపోటు పుట్టినని వైద్యులుతలచి తీసివేసిరి. ఇంకరెండుమూడు రోజులలో మహాత్మునినెత్తురుపోటు చాలతగ్గగలదని వైద్యులు నమ్ముచున్నారు. అయితేవారు చాలబడలిక జెందినట్లున్నారు.

# ఆంధ్ర రాష్ట్ర వార్తలు

[స్వకీయ విలేఖరి]

బెజవాడ జనవరి ౧౦,

ఆంధ్రమహాసభా స్థాయిసంఘ సమావేశము మద్రాసులో "ఆంధ్ర మహాసభా గృహము" (గోడౌన్ వీధి-జార్జిటౌను)లో యీ నెల ౧౭వ తేదీని జరుగును. అందు మైసూరుఆంధ్రులను గురించియు, దక్షిణాంధ్రులనుగురించియు రెండు విచారణసంఘములను ఎన్నుకొందురు. మరియు ఆంధ్రులలో వ్యాయామపరిశ్రమను వృద్ధిచేయుటకై సంఘమును నియమించుట, మద్రాసు పరగణాలలోని చాంబాజిల్లాలో జేరిన శిరివంచ తాలూకాను తూర్పుగోదావరి జిల్లాలోనికి జేర్చుటను గురించియు, రాజమండ్రి-భద్రాచలం-శిరివంచ-చాందా యినుపదారిని నిర్మించుమని రైల్వేబోర్డునడుగుట ఈతీర్మానములుచర్చకు వచ్చును.

* * * *

ఆంధ్ర రాష్ట్రీయ [కాంగ్రెసు] మహాసభ యీనెల ౨౫-౨౬ తేదీలలో కాకినాడలో జరుగును. ఆసందర్భములోనే తూర్పుగోదావరి మండలాంధ్ర మహాసభ జరుగును.

* * * *

ఆంధ్రరాష్ట్ర మంతటిలోను కాంగ్రెసు వర్ణోత్సవము మహా వైభవముతో జరిగియుండెను.

* * * *

హిందూ మహాసభ యొక్క- ఆంధ్ర రాష్ట్ర శాఖను త్వరలో స్థాపించుటకు యత్నములు జరుగుచున్నవి. గుంటూరులోగాని ఆదోనిలోకాని రెండవ ఆంధ్రరాష్ట్ర హిందూ మహాసభ జరుగును!

## కాంగ్రెసుచరిత్ర

ఆసేతు హిమాలయపర్యంతము ఆంగ్లములో నేకాకుండ మరిపదిభాషలలోకూడ కాంగ్రెసు చరిత్ర ప్రచురింపబడెను. డాక్టరు భో. పట్టాభిసీతారామయ్యగారి ప్రకృతి భారతావని యంతయు మారుమ్రోగుచున్నది. ఆ చరిత్రలో ఆంధ్రులకు చక్కటిస్థాన మివ్వబడెను. పూర్వము కాంగ్రెసు అధ్యక్షులైనవి. అనందాచార్యులు గారు తెలుగువారని స్పష్టపరుచబడినది. శ్రీన్యాపతి సుబ్బారావుపంతులు [రాజమండ్రి] గారు మహానాయకులుగ వర్ణింపబడిరి. సందర్భానుసారము శ్రీ బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య పంతులు, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య, చెన్నేటి విశ్వనాథం [కాకి] మద్దూరి అన్నపూర్ణయ్య [రాజమండ్రి] మున్నగువారలు సూచింపబడిరి.

# ప్లేగు హైదరాబాదు పట్టణమున మరల ప్రబలుచున్నది

హైదరాబాదు ప్లేగు కమిషనర్ గారు యీ క్రిందివిధముగ ప్రకటించుచున్నారు:—

ఈఅంటు రోగము జనులయొక్క సహాయముచే వ్యాపించకుండ చేయవచ్చునని ఆరోగ్య శాఖాధికారులు గట్టిగా నమ్ముచున్నారు. ఈ ప్లేగు వ్యాధివలన యివివరకు సంభవించుచుండెడు జనులకు ప్రాణనష్టము పట్టణమునకు ఆర్థిక దుస్థితులు మొదలగు అపాయములనాంచి తప్పించుటకు ప్రజలు ఆరోగ్య శాఖాధికారులకు సహాయము చేయవలెను. ఈవిధముగా చేసిన యెడల యీవ్యాధినుండి ప్రజలును, తమ పరిశ్రమలును తప్పింపబడి తమ పట్టమునకు అభివృద్ధిని తేగలుగుదురు. సాధ్యమైనంత సహాయము ప్రజలు చేయుదురని ఆరోగ్యశాఖవారు నమ్ముచున్నారు. ఈక్రింద వివరించినట్లు ప్రజలందరు సహాయము చేయవలెను.—

[౧] ఇండ్లను పరిశుభ్రముగా నుంచుట మరియు తమయిండ్లలోనికి గాలిని ధారాళముగా వచ్చునటుల చేయవలెను. [౨] ప్రతిరోజు మూడుగంటలకు తక్కువగాకుండ వారివారి బట్టలను, పక్కబట్టలను యెండలో అరవేయవలెను. [౩] భోజన పదార్థములను యెలుకలు చొరరాని పాత్రలయందుంచి భద్రపరుపవలెను. [౪] ఎలుకలను చంపుటయందును పట్టుకొనుటయందును ప్లేగు శాఖాధికారులకు తగు సహాయము చేయవలెను. [౫] ప్లేగు శాఖాధికారులచే లిమ యిండ్లలోనున్న యెలుక కన్నములకు గంధకపుపొగ పట్టించుకొనవలెను. [౬] ఎవరికైన ప్లేగు తగిలినదని అనుమానమున్నను బయటి గ్రామములనుండి ప్లేగుతో యెవరైన వచ్చినను, లేక యిరుగుపొరుగు యిండ్లలో యెలుకలు పడినను తక్షణమే స్పెషల్ ప్లేగు ఆఫీసరుగారికి తెలియపరచవలెను. [౭] ప్లేగు వ్యాపించిన గ్రామములలోనుంచి యెవరైన ఈపట్టణమునకు వచ్చినపుడు టెలిఫోన్ (నం ౬౩౬౬) ద్వారా తెలియపరచవలెను. ఇట్లు తెలియపరచినవారిపేరు అడుగబడదు. [౮] ప్రతివారు వారికుటుంబముతో సహా ప్లేగుటీకాలు తీయించుకొనవలెను. ఈసంవత్సరము యీ టీకాలు తీయించుకొనుట చాలా అవసరము ఎందుకనగా ప్లేగు వ్యాపించిన గ్రామములనుంచి యీపట్టణములోనికి అజ్ఞలనుదాటి ప్రజలు వచ్చుచున్నారు. ప్లేగుటీకాలు ప్రతి దవాఖానాలోను ప్లేగుసెక్షన్ ఆఫీసులలోను స్పెషల్ ప్లేగు ఆఫీసులోను ప్లేగువున్న ప్రతిస్థలములోను తీయుదురు. గోషా స్త్రీలకు ప్లేగువున్న ప్రతిస్థలములోను పొక డాక్టరు మేంసాబు ప్రతిరోజు ప్లేగుటీకాలు తీయుటకు యేర్పాటు చేయబడినది. [౯] తమతమ యిండ్ల చుట్టుపక్కల ప్లేగు వ్యాపించినపుడు యిండ్లను కాలీచేసి హెల్తు క్యాంపులకుగాని సఫాయి సరిహద్దులందాటి మరియేయితర పైదానములకుగాని పోవలయును. ప్లేగువ్యాధివున్న స్థలమునుండి స్పెషల్ ప్లేగు ఆఫీసరుగారి అనుమతిలేకుండా సఫాయి హద్దులలో ప్లేగు లేని స్థలములలోనున్న మరి యేయింటికి పోయినను, అది తప్పుగాయెంచబడును. [౧౦] ఎవరైనను ప్లేగురోగముచేత పీడింపబడుచుండినయెడల ఐసోలేషన్ దవాఖానాలో చికిత్సచేయబడును. ప్లేగువ్యాధి ఆరంభించిన తక్షణమే యిట్టిచికిత్స పొందుటవలన త్వరలో వ్యాధి కుదురుటకు సాధ్యమగును.

## జూబిలిచందాలకై సభ

౨౦వ జనవరిలో ఉస్మానాబాద జిల్లా కచేరీలో జూబిలిచందాల ప్రోగుచేయుటకొరకు సభజరిగినది. స్థానికకాచేరీలు చందాలనివ్వుటకు ప్రోత్సహింపబడినవి. ఆదాయమునులోని పద్దున వంతుచందా నివ్వవలయునని నిర్ణయింపబడినది. కమిటీలో స్థానికాధికారులును, వకీలును మున్నగువారు,

## బజారుధరలు

### దడువై రామన్నగారు

(హైద్రాబాదు ఉస్మానుగంజు)

౧౦—౩—౧౯౩౬

| | | |
|---|---|---|
| | పల్లా 1కి | రు॥ అ॥ పై॥ |
| బన్సి గోధుమలు | ,, | ౧౩-౧౩౪ |
| గోధుమలు జైన్వా మొ॥ | ,, | ౧౨-౧౨౪ |
| బియ్యము దొడ్డవి మొ॥ | ,, | ౧౩౦-౧౩౪ |
| ,, నాజకి రాంబుల కొత్తవి | . | ౧౩౪-౧౮ |
| . డిటో పాతవి | ,, | ౧౬ ౪-౧౭ |
| ,, శ్రీరిచినాంబారులు కొత్తవి | ,, | ౧౮౪-౧౫ |
| ,, రాము సాగరాలు కొత్తవి | ,, | ౧౨౧-౧౩౪ |
| ,, పెసోడీలు మొదలు | ,, | ౨౬-౩౦ |
| కందులు | పెద్దవి , | ౯౪-౧౦ |
| కందిపప్పు | పెద్దవి | ౧౮ -౧౫ |
| పచ్చపెసలు | , | ౧౦౪-౧౧ |
| పెసరపప్పు | ,, | ౧౮౪-౧౫ |
| నల్లపెసలు | ,, | ౭౪-౯ |
| మినుములు | ,, | ౯-౯ |
| మినప పప్పు | , | ౧౮౪-౧౫ |
| ఉలవలు | ,, | ౭-౭౪ |
| జొన్నలు | ,, | ౯౪-౧౦ |
| శనగలు | ,, | ౧౨౪-౧౨౪ |
| సెనగలు | ,, | ౧౦-౧౦౪ |
| పుప్పు | ,, | ౧౩-౧౩ |
| తవుడు | ,, | ౩-౮ |
| సజ్జిగింజలు | ,, | ౭-౭ |
| అలచందలు | ,, | ౯-౯౪ |
| అనుములు | ,, | ౯౪-౯ |
| బటానీలు | ,, | ౯౪-౯౪ |
| తెల్లనువ్వులు | ,, | |
| బెల్లము | ,, | ౧౨-౧౩౪ |
| ఎఱ్ఱ చక్కెర | . | ౧౭౪-౧౯ |
| తెల్ల చక్కెర | శేరు ౮౦కి . | ౧౨౪-౧౩ |
| మదరాసు చక్కెర | ,, ,, | ౧౨౪-౧౩ |
| వేరుసెనగ | చిన్నవి ,, | ౧౭౪-౧౬ |
| పసుపు | . | ౧౩-౧౮ |
| మిరప కాయలు మొరటు | . | ౨౧-౨౬ |
| చింతపండు | మొ॥ | ౧౭-౧౭౪ |
| మెంతులు మంచివి 16 సేర్లకు | , | ౨౪-౭ |
| అల్లం | 12 సేర్లకుమొరటు | ౧౪-౨ |
| ఉల్లి | 10 సేర్లకు | ౮౩-౮౮ |
| వెల్లుల్లి | పల్లా 1 కి | ౯-౯ |
| యెల్లిగెడ్డ | ,, | ౩౪-౮ |
| మెంతులు | 12సే॥ | ౨౪-౩ |
| వేరుసెనగనూనె | ,, | ౮-౮ |

## హైదరాబాదకోఆపరేటివ్

### ఇన్షూరెన్సు సొసైటి లిమిటెడ్

మీ జీవితమును భీమా చేయించుడు

ఇది ప్రభుత్వ సహకారశాఖ నాయంగారి నిగ్రానిలోనున్నది. ప్రభుత్వ ఉన్నతోద్యోగులు కొందరును, నగర ప్రముఖులు కొందరు, ఇందలి గౌరవ కార్యనిర్వాహకులు. మా ఇన్సూరెన్సు సొసైటీ సంపూర్ణముగా సహకార పద్ధతుల నవలంబించును లాభములన్నియు పట్టాదారులలోనే పంచిపెట్టబడును వివరము లకు వెంటనే క్రింది వారికి వ్రాయుడు.

హెడ్డాఫీసు: సుల్తానుబజారు

---

శిశువుమార్కుగల్గి

# సువాసనగల

# ఆముదము

(పరిశుద్ధమైనది, గ్యారంటీ)

ఈ ఆముదము ఎఱ్ఱనిరంగుయుండి, మంచి వాసన, రుచి కలిగియుండును. ఇది మధురముగాను, సువాసనగాను యుండును. కనుక అందరును సులభముగా తీసుకొనగలరు.

ఇది పసిపిల్లలకు, సున్నితమైన ప్రకృతిగలవారికి వరప్రసాదము.

(అన్ని చోట్లను దొరుకును)

## దిఇన్ఫెంట్సమాన్యుఫాక్చరింగ్ కంపెనీ

(హైదరాబాదు—దక్కన్)

చేత తయారు చేయబడినది.

---

# ZANDU Pharmaceutical

## Works Ltd., P. O. Box 5513 Bombay

జాండూవారి సుప్రసిద్ధ ఆయుర్వేదౌషధములకై

అఖిలభారత ఆయుర్వేద ప్రదర్శనములలో సువర్ణపతకములు బహుమానింపబడినవి. అన్నిరకముల ఔషధములు. గొప్పగా యంత్రములచేత సిద్ధపరుపబడుచున్న ఈ ఔషధములు భారత దేశమందంతటను బహుళముగా వాడబడుచున్నవి.

### ద్రాక్షాసవము

వరములకు బలమిచ్చు రుచిగలపానీయము. శ్వాసకోశములకు బలమిచ్చి దగ్గు, ఆయాసము, మలబద్ధము తొలగించును. త్రాగుడు యొక్క అలవాటును తొలగించును.

౧౪ పౌను బి. జి. రు ౨—౦—౦

౧ పౌను బి. జి. రు ౧—౯—౦

౪ పౌను బి.జి. రు ౦—౧౮—౦



### మలేరియా మిక్చర్

చలివిషపు జ్వరములకు గొప్ప నివారిణి కడుపులో జ్వరబిళ్లలను పోగొట్టును. (ప్రతిఖురాకును గుణమివ్వగలదని గ్యారంటీ నిచ్చును.)

౧ బుడ్డి బి. జి. ౦—౧౩—౦

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.



### కేసరీజీవన్

దుర్బలుల పాలిటి కల్పవృక్షము వీర్యము నుపుష్టిపరచి బలమును, ఉత్సాహమును కలుగజేయును. పథ్యములేనిమందు. క్షయ మొదలగువ్యాధులకు అద్భుత నివారిణి.

౧ పౌను బి జి. రు. ౫—౦—౦; ౪ పౌను బి.జి. రు. ౨—౧—౨—౦;

౦।౦ పౌను బి. జి. రు. ౧—౯—౦

సోల్ ఏజంట్లు—డి. జె. పారెఖ్ అండ్ కో

జుమ్మామస్జిద్‌వద్ద, సికింద్రాబాదు (దక్కన్)

బ్రాంచి.—డి. జే. పారెఖ్ అండుకో.

సుల్తానుబజారు, హైదరాబాదు - దక్కన్

---

## పాలిసీలు హాలీనాణెములో ఇవ్వబడును

స్టార్, పాలిసిలు రద్దుకానేరవు. పట్టాలు హాలీలో జారీచేయబడును. అపాయకాల విస్తరణ, ఆకస్మిక ప్రమాద మరణమువలన రెండింతల లాభము, శాశ్వత అశక్తతలాభములు, సరళమైన సరెండరువిలువలు, గ్యారంటీచేయబడిన బోనసులు యింకను యెన్నియో లాభములు గలవు. వివరములకు వ్రాయుడు.

## స్టార్ ఆఫ్ యిండియా ఐ. అండ్ జి. అష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్, (మదరాసు)

బ్రాంచి:— హనుమకొండ (దక్కను)

పి. యస్. శాస్త్రి,

డివిజనల్ ఆర్గనైజర్:— [illegible]

నిజాంరాష్ట్రము

# సూర్యుని ప్రభావము

## మానవుని అదృష్టమునకు మూలమని నవీన పరిశోధనలు తెలుపుట

మన పూర్వులు సూర్యుని సకల జగన్నియంతగా స్తుతించునపుడు వలసినంతయైనను అతిశయోక్తి చెప్పలేదని నేటి క్రొత్తక్రొత్త సైన్సు పరిశోధనల వలన రుజువగుచున్నది. ఇప్పుడిప్పుడే వెల్లడియైన రెండు పరిశోధనల ఫలితములు మానవుని అదృష్టమంతయు సూర్యుని వశములో నున్నదని నిరూపించుచున్నవి.

అందు మొదటిది డాక్టర్ హాగ్గార్టి, స్టెట్సర్ గారు కనుగొనినది. వారు హార్వర్డు విశ్వవిద్యాలయములో భూగోళపరిశోధనశాఖలో పనిచేయువారు. మానవునికి నిరుత్సాహము లేకుండుట, ఉత్సాహము, చురుకుదనము చేరి సకల కార్యములందును జయము కలిగించుట—యివంతయు సూర్యునివలననేయని వారనుచున్నారు. మానవుని ప్రకృతియు, కార్యసాధన వశీకరణ శక్తులును మానవుని శరీరములోనుండు థిరాయిడ్ గ్రంథివశమైయున్నది. ఆ గ్రంథి సరిగా పనిచేయుచో మానవుని శక్తులు సంబుపోకయుండును. దీర్ఘకాలము సూర్యరశ్మి సోకనియింటిలో గాలికిని సూర్యరశ్మి సోకుచుండు గాలికిని రసాయనిక సమ్మేళనములో (Chemically) యేలాటి భేదముగాని లేదని పరిశోధనలవలన తేలినదని వారనుచున్నారు. ఈభేదమంతయు సూర్యరశ్ములనుండి గాలిలో ప్రవేశించు విద్యుచ్ఛక్తి వల్లనే కలుగుచున్నదనియు వారు పరిశోధనలవలన కనుగొనినారు. ఈయంశమును నమ్మకముగ శోధించుటకై ఒక్క మూసినగదిలో అదే స్వచ్ఛమైన గాలినుండి "నెగటివ్ యలెక్ట్రిసిటీ" తో నిండిన గాలి అణువులను తగ్గించుచుపోగా ఆ గదిలోనున్న మనుష్యునికి తలనొప్పియు, అలసటయు పట్టినవట, మరల నెగటివ్ యలెక్ట్రిసిటీ ప్రవేశపెట్టగా ఆమనుష్యుని అలసట పోయెనట.

* * *

కానిస్‌లో మెడిటరేనియన్ మెడికల్ సొసైటీ కాంగ్రెసు జరిగినది. అందు సమావేశమైనవారు దేశమునకు విపత్తులు, ఉపద్రవములు, నేరములు ఆత్మహత్యలు - యిట్టి దురదృష్టములు సంభవించు సమయములను ముందుగా కనుగొనవచ్చునని వివిధదేశములలోని అబ్జర్వేటరీలనుండి వచ్చిన రిపోర్టుల వలన తేలుచున్నట్లు ప్రకటించబడినది. అందులో ఒక అబ్జర్వేటరీయొక్క అధికారియగు డాక్టర్ డీనియర్ గారు వాతావరణములోనుండు విద్యుచ్ఛక్తి పరమాణువులలో యెట్టి అల్లకల్లోలము గానికలుగుటకు ముందు సూర్యునిలో మచ్చలు కనబడునని చెప్పుచున్నారు. ఈ వాతావరణములోని విద్యుచ్ఛక్తి పరమాణువులలో మార్పువలన పంచభూతములన నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములలో మార్పులేర్పడును. భూకంపములు, తుపానులు, నదుల వెల్లువలు మున్నగునవన్నియు యీకారణముచేతనే సంభవించుచున్నవి. అంతేగాదు. వాతావరణములోని విద్యుచ్ఛక్తి పరమాణువులలో అల్లకల్లోలముచే పంచభూతముల ప్రపంచము తారుమారైనపుడు శారీరకముగాను మానసికముగను మార్పులైన మానవులకు రోగములును, చావులును, మనోవ్యథలును, పిచ్చిదుఃఖములును అధికముగా సంభవించును నేరములు, హత్యలు మున్నగునవి వృద్ధియగుటకిదియే కారణము.

కావున మొత్తముపై నిదంతయు సూచించునదేమి, మానవుని అదృష్టదురదృష్టములును, దేశములయొక్క భాగ్యాభాగ్యములును తుదకు విద్యుచ్ఛక్తిపయి ఆధారపడియున్నవి; ప్రపంచమంతయు ఆశక్తియొక్క పనిచేతనే వివిధరీతులుగ ప్రవర్తించుచున్నది. మన పెద్దలు ఈ విశ్వశక్తినే జగన్మాతగ పూజించుచుండిరి.

---

## పదేండ్ల ఆయుర్వృద్ధి చేయు రసి

ఆర్జెంటినాలో యిద్దరు సైంటిస్టులు మనుష్యుడు యెంతసేపు పనిచేసినను అలసటరాకుండ పనిచేయునట్టి ఒక రసిని కనిపెట్టినట్లు చెప్పుచున్నారు. ఈరసిని ఒక కుక్కకు ఇంజక్షను చేయగా ఆకుక్క ఒక మిల్లులో ౧౬ గంటల కాలము విసుగు విరామము లేకుండ పనిచేసెనట. ఈ రసిలో ప్రాణశక్తినిచ్చు "హార్మోను" అనునది ఒకటియు, సంభోగశక్తి నిచ్చు "హార్మోను" ఒకటియు చేరియున్నవి. ఈ రసి యింజక్షను చేయుటచే యెవరుగాని పదేండ్లు అదనముగా జీవించగలరట. ఈసంబంధమై అవసరమైన తక్కిన పరిశోధనలన్నింటిని చేయుటకై రాక్ఫెల్లర్ నిధినుండి రు ౩౦౦౦ పౌనులు ఆ సైంటిస్టులకొసగబడినది.

### దుష్టగ్రంథి వంశవ్యాధి

దుష్టగ్రంథియను రోగములు [Cancer] ఒకరికి వచ్చినచో అది అతనినుండి అతని కొడుకులకు వసుమలకు ఈవిధముగ సంక్రమించుచుండవచ్చును — అను అనుమానము పరిశోధనల చే అంతకంతకు బలముకలుగుచున్నది. ౧౬ శ్రావణ ౧౯౩౪ లో ౭౫ యేండ్ల వయస్సుగల ప్రఢంగియొకడు మెగచుసెట్సు ఆస్పత్రికిపోయి అన్నము తినలేనని చెప్పుకొనెనట. నరికొన్ని రోజులతర్వాత యింకొకడును అదే వ్యాధితో బాధపడుచువచ్చెనట. ఇరువురికి ఆదుష్టగ్రంథులు ఒకేచోట నుండెనట. విచారించగా వారిరువురు అమడలని తెలియుటచే యిపుడు కొన్నరు స్పెషలిస్టులు ఆరోగ్యము వంశములో ఒకరినుండి యింకొకరికి సంక్రమించుచుండవచ్చునని తలచుచున్నారు.

## ప్రపంచము పూర్వము కంటె యెక్కువ వేగముతో తిరుగుచున్నది

౧౯౩౪ నుండి ప్రపంచము పూర్వముకంటె చాల వేగముగా తిరుగుచున్నట్లు "జర్మన్ యిన్స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్" వారు పరిశోధించి కనుగొనినారు. ఒక సెకండును వేయిభాగములు చేసినచో రోజు ౧ కి అట్టిభాగములలో ఒకటవంతున వేగము హెచ్చుచున్నదట. ఇందుచేత సంవత్సరములో ౧ సెకండు కంటె యెక్కువగా తగ్గుచున్నది.

### యువతీ ఆరోగ్యవిధులు

రచయిత్రి శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు. వీరిపేరు యిదివరకు శిశురక్షణయను గ్రంథమే ఆనేకులకు పరిచయము చేసియుండును. శిశురక్షణలో శిశువునుగురించి ప్రత్యేకముగ తెలియదగిన జాగ్రత్తలు విశేషముగ చెప్పబడియుండెను. ఇపుడు యీగ్రంథములో అదియొక అధ్యాయము మాత్రమై ప్రసవమునకును, గర్భధారణమునకు ముందును, ప్రసవమైనపిమ్మటను స్త్రీలు ఆరోగ్యరక్షణార్థమై పాటించదగిన విధులు వివులకారణములతోసహా వివరింపబడినవి. ఇంకను అనేకములగు చిట్కా చికిత్సలు రోగులకుచేయదగిన ఉపచారములు తెల్పబడినవి. ప్రతిస్త్రీయు చదివిగాని, చదివించుకొనిగాని తెలసికొనదగిన అమూల్యవిషయములిందు తెలుగుభాషలోనున్నవి. వెల ౧ రూపాయి. హైదరాబాదులో గ్రంథకర్త్రిగారినుండి దొరకును

# సిరిసిల్ల మహాసభ వ్యాయామ పోటీలు

## అనేకనాయకులు పాల్గొనుటకు ముందురాకుండుట

ఆంధ్రమహాసభ సందర్భమున నీసంవత్సరము ఆంధ్రయువకులకొరకై వ్యాయామపోటీలు జరుపుటేర్పాటు గావించినందులకు సిరిసిల్ల ఆంధ్రయువజనసంఘమువారు గభినందనీయులు. జాతీయజీవితమునందు వ్యాయామపోటీలెంత ప్రాముఖ్యతవహింప నవకాశముగలదో, ప్రస్తుతము పాశ్చాత్యదేశమందలి జాతీయ జీవితమును గమనించిన వెల్లడికాగలదు.

మనదేశము నందిప్పుడిప్పుడు కొంతఅభిరుచి అభివృద్ధి అగపడుచున్నప్పటికిని మనజాతీయ గౌరవమునకు దగినంత నైపుణ్యత మనము సంపాదించలేదు. ఒక హాకీతప్ప యితరములైన ఏపోటీలయందుకూడా భారతీయులకు అంతర్జాతీయ ప్రాముఖ్యతలేదు.

౧౯౩౬వ సంవత్సరమునందు ప్రాగ్ దేశములపోటీలయందు, పాల్గొన్న భారతీయ జట్టు నాయకుడు తిరిగి ఈదేశమునకు వచ్చినతరువాత మనము గమనింపవలసిన కొన్నిముఖ్య విషయములు పత్రికాముఖమున తెలిపియుండిరి. ఈ పోటీలు జపానునందలి "టోకియో"నగరమునందు జరిగియుండెను. జపానుదేశపు పోటీదారులనిపుణతను బాగ ముచ్చటించుచు, భారతీయుల యభివృద్ధి ఈవిషయమున సమంజసముగాలేదనియు, యిదేవిధముగా పరిస్థితులున్నచో కొలదికాలములోనే జపానుదేశపుస్త్రీలు, భారతీయ పురుషులను, పోటీలయందు జయించగలరనియు హెచ్చరించిరి.

భారతదేశమునందలి వివిధరాష్ట్రములలో, పంజాబు, బెంగాలురాష్ట్రములు వ్యాయామనైపుణ్యతయందు ప్రథమ, ద్వితీయస్థానముల నవలంబించుచున్నవి. ౧౯౩౬వ సంవత్సరమునందు అలహాబాదు నందుజరిగిన అఖిలభారత పోటీలయందు, హైద్రాబాదు రాష్ట్రముపక్షమున నేనుకూడా ఒకయభ్యర్థిగా నుంటిని. కావున అచ్చట నెన్నియోవిషయములు తెలుసుకొను నవకాశములు లభించినవి. హైద్రాబాదురాష్ట్రము ఆసమయమున మూడవస్థాన మాక్రమించియుండెను.

సిరిసిల్లయందు ఆంధ్రమహాసభ సందర్భమున నాచే జరుపబడిన వ్యాయామపోటీలయందు పాల్గొనిన అభ్యర్థులుకొందరు ప్రయాణవ్యయములు భరింపలేని కారణమున సైకిళ్లపై హైద్రాబాదు నుండిసిరిసిల్లవరకు సుమారు ౧౧౦ మైళ్లు ప్రయాణముగావించి, వ్యాయామపోటీలయందు పాల్గొనిరి. వ్యాయామమునందు వీరి యుత్సాహమునకిది నిదర్శనము స్పష్టమగుచున్నది. హైద్రాబాదునుండి వచ్చిన పోటీదారులందరు సమంత నిపుణతగలవారని చెప్పిన, అతిశయో

క్తిగాజాలదు. దీనిలోకొందరు హైద్రాబాదురాష్ట్రమునందు ఏప్రదేశమునందైనను, ఏర్పాటుగావింపబడిన పోటీలయందు మిక్కిలినైపుణ్యత జూపగలరని నాకునమ్మకము గలదు. ఆంధ్రులు వ్యాయామములందు ఈరాష్ట్రమున ఇతరులకెవ్వరికిని తీసిపోజాలరని, వీరినైపుణ్యతగమనించిన ఒప్పుకొనకతప్పదు. ఆంధ్రులిట్టి వ్యక్తిపూర్వకమైన సామర్థ్యమును ఆధారముచేసికొని గర్వింపవలసినఅవసరమేమియులేదు. సంఘమునందు కొందరువ్యక్తులు నిపుణతగలవారుగానుండినజాలదు. సామాన్యముగా ఆంధ్రులు బలహీనులని ఒప్పుకొనకతప్పదు.

పోటీదారులు నైపుణ్యతజూపిన విషయమునుఈక్రింది వివరముల యుక్తముగా పొందుపరచుచున్నాను.

౧ మైలుపరుగు, ౨ అర్ధమైలుపరుగు:—ఈరెంటియందు ప్రథమబహుమానములు శ్రీయుత వెంకటస్వామిగారును, రెండవబహుమానములు శ్రీయుత వి. లక్ష్మారెడ్డిగారును పొందియున్నారు. వీరు ఈపోటీలయందుజూపిన నిపుణతమిగుల ప్రశంసనీయమైయున్నది. పోటీలకొరకైనియమింపబడిన సభామంటపము ముందటి మైదానము ఇసుకచే నిండియుండుటచేతను, స్టాప్ వాచ్ అను గడియారము వెంటలేనందునను, వీరు పరుగెత్తు కాలనిర్ణయము చేయవీలులేకపోయినది. అయినప్పటికిని వీరు హైద్రాబాదు రాష్ట్రములో, ఉపయుగులయందు ప్రథమద్వితీయులనినాకు తెలిసినంతవరకు చెప్పసాహసించుచున్నాను.

౨౨౦ గజముల పరుగు

దీనియందు ప్రథమబహుమానము శ్రీయుత రాజలింగముగారును, రెండవ బహుమానము శ్రీయుత కె. లక్ష్మారెడ్డిగారును పొందియున్నారు. పైకారణముచేతనే వీరుపరుగెత్తు కాలనిర్ణయము గావింప వీలులేనప్పటికి, వీరుకూడ మిక్కిలి నిపుణతజూపిరని చెప్పగలను.

ఉద్ఘంప

దీనియందు శ్రీయుత కె. లక్ష్మారెడ్డిగారు ౫ అడుగుల ౭ అంగుళములు ఎత్తుపైగా ఎగిరి ప్రథమబహుమానమును, మరియు శ్రీయుత హనుమంతరావుగారు ౫ అ. ౫అం. ఎగిరి ద్వితీయబహుమానమును పొందియున్నారు. ఇదిమిక్కిలి ప్రశంసనీయమైన కార్యమే.

దండెఝంప (Pole Jump)

దీనియందు ప్రథమబహుమానము పొందిన శ్రీయుత లక్ష్మారెడ్డిగారు దండెసహాయముచే ౯ అడుగులు సులభముగా లంఘించిరి. అచ్చట భూమియందున్న ఇసుకలేక, సరియైనదండము వారికిలభించినచో, ఇంకను ఎక్కువనైపుణ్యత జూపగలరని ఆశగలదు.

పైనుదహరింప బడినవారందరును మనప్రభువరేణ్యుని రజతోత్సవ సందర్భమున ప్రభుత్వమువారిచే నేర్పాటుగావింపబడు వ్యాయామపోటీలయందు పాల్గొనుచున్నారు. వీరిలోకొందరికి, బీదలగుటచే ఆర్థికకష్టములచే సరియైన, ఆవకాశములు లభింపక నైపుణ్యత వికసించకపోవచ్చును. అట్టివారికి ఆంధ్రజన కేంద్రసంఘమువారైనను, లేక ఆంధ్రయువజన సంఘమువారైనను సహాయముగావించి ప్రోత్సహించిన బాగుండునని నేను సూచించుచున్నాను.

వ్యాయామమునకు సరియైన పరికరములు లభింపకపోవుటచే పోటీలు జరుపుటయందు నాకెన్నియో ఇబ్బందులు సంభవించినవి. ముందుజరుగు ప్రతిమహాసభయందుకూడావ్యాయామపోటీలుజరుపవలసియున్నచో, ఆంధ్రజనసంఘమువారు, కొన్నిస్థిరమైన వ్యాయామవస్తుసముదాయమును సమకూర్చి పెట్టుకొనుట సమంజసము. వివరములు కోరినచో తెల్పెదను.

బాలికలకొరకుగూడ వ్యాయామపోటీలుఈ సంవత్సరము జరిపినట్లే, ప్రతిసంవత్సరము జరిపి వారికి వ్యాయామజీవితమునందు అభిరుచినిప్రోత్సహించుట సమంజసము. నాఅభిప్రాయమునందు ప్రస్తుతము మనసంఘమునందు బాలురకెంతవ్యాయామము అవసరమో, అంతకంటె నెక్కువ బాలికలకు అవసరము. మనతల్లులబలహీనతయే మనదౌర్బల్యమునకు కారణము. శారీరక దౌర్బల్యముగలవారికి హృదయదౌర్బల్యము సహజము. ఆంధ్రస్త్రీ లెంతవరకుగోషాలయందేదాగి వ్యాయామము మొదలగు సజీవములగు కార్యములందు పాల్గొనరో, ఆంధ్రులయభివృద్ధికూడా అంతవరకు గోషాయందే దాగియుండగలదు. రాబోవు సంవత్సరమునందు వ్యాయామపోటీలయందు బాలికలేగాక యువతులుగూడా పాల్గొనెదరని నమ్ముచున్నాను.

యువకులకు వ్యాయామ మెట్లవసరమో, వృద్ధులకుగూడా అవసరము. వయస్సునకు తగినట్టిపోటీలను ఏర్పాటు గావించ వలయునను ఉద్దేశములో నాయకులకు నడకపోటీమాత్రము ఏర్పాటుగావింపబడినది. కాని ఆంధ్రనాయకులలో ముఖ్యులగు ఒకరిద్దరుమాత్రమే దీనియందు పాల్గొనుటమిక్కిలి విచారకరమైన సంగతి. ఆంధ్రనాయకులు పోటీలయందు పాల్గొనుట అవమానముగా ఎంచరాదు. రాబోవుసంవత్సరమునందు నాయకులందరును ఈపోటీలయందు పాల్గొనెదరని నమ్ముచున్నాను

ఈసారి పాల్గొన్నవారిలో సు. ప్రతాపరెడ్డిగారును. అవునూరి వేణుగోపాలరావుగారును, డాక్టర్ తులా కనకసుందరంగారును. సి. వెంకటరెడ్డిగారును, మాదిరాజు రామకోటీశ్వరరావుగారును, ఉప్పుల వెంకట్రామయ్యగారును, జే. రాంరావువకీలుగారును, ఇరుకుల నారాయణగారును గలరు.

### ఆసనములు

పోటీయందు హరిజన వసతిగృహమునకు చెందిన "విష్ణు" అనువిద్యార్థి, రెడ్డివసతిగృహమునకుచెందిన రామచంద్రారెడ్డిగారును, యోగాసనములలో మిక్కిలినిపుణతను జూపించినందున వారికి ప్రత్యేకబహుమానములు ఒసంగబడినవి

బహుమానములు పొందినవారి పేర్లు

1. మైలుపరుగు: వెంకటస్వామిగారు మొదటి బహుమానము
   వి. లక్ష్మణరెడ్డిగారు రెండవ
2. అర్ధమైలుపరుగు: వెంకటస్వామిగారు I
   వి.లక్ష్మారెడ్డిగారు II
3. గుండువిసరుట: రామలింగంగారు I
   వి.లక్ష్మారెడ్డిగారు II
4. దండెఝంప Pole Jump) కె. లక్ష్మారెడ్డిగారు I
   రాజలింగంగారు II
5. దీర్ఘఝంప (Long Jump): కే. లక్ష్మారెడ్డిగారు I
   రాజలింగంగారు II
6. ఉత్ఝంప(HighJump: కే.లక్ష్మారెడ్డిగారు
   హనుమంతరెడ్డిగారు
7. కట్టెసాము: పి. వెంకయ్యగారు I
   బాలయ్యగారు II [వీరిద్దరును గజానన వ్యాయామశాల హైద్రాబాదునకు జెందినవారు]
8. బాలికలపరుగు సుగుణగారు I
   రాజమణిగారు II
9. దండాలుదీయుట: కె.వెంకటయ్యగారు I
   ఎ. రాంచంద్రారెడ్డిగారు II
10. 220 గజములు: రాజలింగంగారు I
    కే. లక్ష్మారెడ్డిగారు II
11. నాయకులనడుచుపోటీ: జే. రాంరావువకీలుగారు I
    ఇరుకుల నారాయణగారు II
12. ఆసనములు: విష్ణుగారు
    ఏ.రామచంద్రారెడ్డిగారు ప్రత్యేకబహుమానములు
13. బాలికల కట్టెసాము: చండికమ్మగారు I
    కొంతమ్మగారు II

ఇట్లు
రావి: నారాయణరెడ్డి

ఆంధ్రులకు

౭౦ లక్షల నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధికి ముఖ్యసాధనము గోలకొండ పత్రికా పోషణము.

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA
HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizams Dominions.

కలకు ౨ మిజ

ఆ మిహరక్తవృద్ధికి సాధనము! గోలకొండ పత్రికలో ప్రకటనము.

Vol. 10. | Monday 31—1—1936 | No. 68

## విపంచి తంత్రీస్వనములు

వ్యాసకర్త
ఉభయభాషాప్రవీణ రాధాకృష్ణమూర్తిగారు

విపంచిమనోహరగీతికాస్తోమోద్ధరణము, ఇందలిగీతముల మున్నె యాలపించ కొన్నది విశ్వవిపంచి. అవిమలల మధుమాగాధమున మసలిన కోకిలగళమున క్రొత్తరాగములతో మారు మ్రోగినవి.

కవిత్వమును, గాంధర్వమునుగూడ కళలే. కవిగాయకులిరువురును శ్రోతల హృదయములను రంజింపజేయువారే, కాని వారిసాధన సామగ్రివేఱు, కవికి కలము, గాయకునికి విపంచి. ఇయ్యుభయకవి విపంచిని గాని తన మధురగీతముల నాలపించుచున్నాడు. ఆహ్వాన పురస్కృతుడైనకవి ప్రణయబంధంబున జిక్కి సుభాషణముల శేరాణి, చుక్కకన్నె, చందమామ పూలమాలలలో నొదిగి సాకీ తేటబోటుల పలుకరించి తరంగిణి తుంపరలనోలలాడి కౌపుపదుచు మగనాలితనమునకు మురుగుచు కవిరాజై సాక్షాత్కరించినాడు. అట్టికవి యల్పకవికుల మూర్ధన్యుడై కుటిలమానవసమాజ కల్పితన్యాయ హీనశాసనాధీన దుర్బలస్వాంతుడు గాక యతని గర్వాలంకృతశ్రీ పదాంభోజములు రాజాస్థానములు తలదాల్చి "నమస్తే అస్తు భగవన్"యనుచు నెదుటబడుచున్నాడు. ఇట్టికవికి

మెల్లగా సాగిపోయెడి మేఘశకల
మింతకదలని పర్వత శృంగసీమ
నీటదేవచ్చునా వెలకోయనురుగు
భువనమోహన సందేశములు దెల్పు.

ననుటలో సందియమేమి? అట్టి ప్రకృతిసందేశముల తలదాల్చి కవితవిపంచికి దిద్దినాడు.

ఇక కావ్యము ఖండకావ్యము. ఖండకావ్యమునందు రసస్ఫురణ మంటటా విలువజాలదుగాన నట్టివ్యాఖ్యానములని కొందఱమతము. "వాక్యం రసాత్మకం కావ్య"మ్మను నుక్తిచే ప్రతివాక్యమునకు రసస్ఫూర్తి ముఖ్యమగ్గిన నిట్టివేల కావ్యములు గావు? రసముండిన వ్యాఖ్యానములేల కావలయును? ఇట్టికావ్యములు సారస్వతమున నూతనములుగావు. శతకకవిత్వ మిట్టిదియే. కాని శతకములందు రసముండదు. ఇట్టికావ్యములు [ఇందలి విషయములను కావ్యములన్న పేరిట వ్యవహరింతును] పురాణ ప్రబంధముల యందచ్చటచ్చట సందర్భోచితముగా వర్ణింపబడియున్నవి. నేడివి ప్రత్యేకదృష్టినంది పూర్వాపరవర్ణనాసమగ్రముగ నొక్కొక్క కావ్యముగా వ్రాయబడియున్నవి.

ఇందు శేరాణి, తుంపరలు, సాకీ, జీవదేవుడు, తరంగిణి, మూగనోము, కౌపుపదుచు, కవిరాజు, సాక్షాత్కృతి మొదలగు విరువది విషయములు వర్ణింపబడియున్నవి. ఇందు ప్రత్యేకముగా సాకీ, జీవదేవుడు, మూగనోము, కౌపుపదుచు, కవిరాజు యనునవి మానవజీవితములతో సంబంధించినవి. మిగిలినవి ప్రకృతి మాత యాగాధము. ప్రకృతి లాలసత్వమే ప్రత్యేకవిలక్షణము.

ఇక విపంచితంత్రుల మీటి తన్మృదుమధుర సంగీతము నాలకింతము.

కవి

అరవిచ్చిన వెల్ల లతాంతచయము
కోరి వాడినవెల్ల శకుంతసమితి,
ప్రకృతిమాత సహస్రకరమ్ము లెత్తి
స్వస్తి నుడివెడు నవతరింప గదవోయి,

అనుచు నట్టిశుభసమయమునందియామయుడగు సూర్యభగవానుని కాహ్వాన మంపి గర్వితార్థము మను తెలిపినాడు. అదిగాక సుకవిర్వాగ్గణులైన యలికులారవులచే యతనిస్వాగతం దేశము విన్నవింపజేసి కర్మసాక్షిని తనవంకకు ద్రిప్పుకొన్నాడు. గ్రంథారంభముగా పకడమ్ముగా వెలివెట్టు మావిచివుళ్ళ జీలు సాపాటుజేసిన కోకిలపు పేరటాండ్రుజేయు నవలీలామయ పంచమ శ్రుతుల మంగళారతుల, పాడించినాడు.

ప్రణయబంధము కొలనుగదలని నీరజలతాంగికిని మిన్నువదలని రవికిని గల్పింపబడినది. కవి "దాఘనమేటికే! ఏల ప్రొద్దులకొండదిల కింతవింత వినగాదో నీరజాక్ష్యత్తమలో"అని తమ్మిజవరాలి రహస్యములు విన నువ్విళులూరుచున్నాడు. ఉదయాచల సానువులు రసస్థారములకుడు నీరజలతాంగి మనసునిట్టిన రాగమె తోచునేమో దిక్తీరములందునని చిత్రమ్ము జెందినాడు. తుదకు సుర్యస్మనోహరాకృతి నవతరించిన ప్రియుని జూచి యూరట జెందినాడు.

సముద్రునిగూర్చినది సుభాషితము. కవిమేదోగరుడమ్ముతో బ్రొమ్మ విరపంపగ నీవిట్టేల యుండుట యనునప్పుడు సంగ్రామమునకు పెడమొగము పెట్టిన వీరాగ్రేసరునకు మిత్రోపదేశమువలెనున్నది. "ఏనాడే చెరపిడిరా గలుగు దోయీ, వేడికన్నీళ్లతో, యీజీవన మెల్లయు వ్యర్థసిపోయెన్"అని సముద్రునిగూర్చి విచారించినమనస్సు "వెల కట్టించిన గర్వస్థేయని మహావిద్వాంసులే నేడు రత్నాలలోనం, దలతెక్తినారలని కినుకవహించి "రత్నాకరుండన్న పేరుల మ్రోయించిన నాతనికొంగ్గదలవేమియని యుద్బోధించుచున్నది.

దొరకిన శావులైనిలువు
దోపిడియిత్తురుపుంతత్రోవల
బ్బురముగ జేలలో కలిసి
పోయిను భంబుగ నున్నకన్న వె
న్వరు మడిగట్టియుండిరి
పల్లకము ప్రేమ్మరువంగ దేరగా
దొరకిన బోవనీయరు గదోయి
తలుపల మ్రాకమింపుమా"

యని యుత్సాహాభ్యుదయైన సముద్రుని బారికొల్ప యింకనునీ "మాయజగమందు మహామహులెల్ల నీతికోవిదులె పరాయివారిజదివించెడివా"నని, బారిజె కలపేరటంబు నాతని తటసలమాక్రమింప నొడంబరచుచున్నాడు. "గురు లెక్కలనెక్కించెత సంచాలనము సలిపెంపు"మని చెప్పుచు కవి తాను మఱుగుగానుండి "ఏదీయగోరకూరికె వచించితి పున్నెమటంచు నచ్చినన్, కొదనకుండి నేయుమటు గానియెదన్ వినిపింపకేలకిన్. నీశుభము సెంచిచెప్పితి, నీవు మొలయ నేరకుండిన నా కిమినీదుకర్మ"యని కవిరంగము నుండి నిర్గమించినాడు. అగు కవి ప్రకృతికిగూడ నాళోచనల జెప్పినాడు.

శేరాణిగూర్చి ప్రసంగించుచుం రమణి వాబైడగు చెల్వాదో ప్రణయమధుర, హృదయలకు జిక్క యీ పరమేశ్వరాంబి, కమను ఒడయుడో భక్తులకరముపట్టి, ఇహపరమ్ములయందునీకేమిగలదు."యని భూమ్యాకాశములకు నడగా నైహికాముష్మికములకైన (జదుక) గా కవి యత్రయింపజేసినాడు.

"పరవాలయికప్పిన నీటిమబ్బు బందాలను ద్రోసివచ్చి యొడదం బెనవైచిన రాగదీప్తులన్ గ్రోలినసికటాక్షములలో తళుకుల్ గుఱిపింతు వీయనంతాలయవీధి వ్యర్థమిది యాతడు లేని యమాసచీకటిన్"అని చుక్కకన్నె గూర్చి నిజూర్పుపుచ్చినకవి "కొంటెకప్పలించు మనకల్ ముసుగుల్ కొనియున్న యీనభో, వాటిక ప్రాణముల్ కనులగట్టి వీక్షణలోన, పన్నిట గరంచుసంబు గమనించెదవెంతటి ముద్దురాలవే"యని జాలివడి జాబుతుదకు "చక్కని చుక్కవవని, నెందజెందలో గలరు ప్రేమించువారు, ప్రకృతశోభా విలాసలాలసులంకపులు" అని యూరటబుచ్చి. నెలనెలగండమట్టి మగనింబడిమాటికి దేవిరించినన్ గలదెఘలంబు నీమనసు కల్గిన వానివరింపుమన్యునిన్"అని తన సౌహార్ద్రతను జాటుచున్నాడు.

"ఎలపోటన్ జెలువంపు మల్లి
యనుగానే బెట్టియున్నన్
ఘనాలిలసత్కీరవినీల వేణిపయి
మబ్బుల్గాలరు పూగుత్తె
మొగ్గలలో నొక్కటినై"

అని తుంపరలలో కవి అచేతనములతో గూడ దాదాత్మ్యమును బొందుచున్నాడు.

సాకీ "ఉమర్ ఖయ్యాము" లోని పాత్రయేమో!

"కోరికదీర మద్యమును గ్రోలి
సమస్తము విస్మరించి యు
ద్వారల కందరాని యనవద్య
సమాధి మునింగి నీయొడిం
గూరుకునందు వేళ బ్రతుకుం
దొరగందు దలంపువుట్టె"

వను కావ్యమియ్యది. అనుభవులోని తియ్యందనము కథానాయకుడును బంధరుడును మాత్రమే యెఱిగినారు. "ముదిరినకొద్దియునిగటు పుట్టుచున్నదీట యీజగము. పరబ్రహ్మోపాసనలకు గూడ వలయు నిట్టిపిపాస లిట్టివే గదా?

పయోధిచంద్రుని యదృష్టము లోకపాటివిగావు కాని ఆదిపోయు యమ్మక్కల దృష్టిదోషముచే నెలనెలకుజిక్కును. కవియతనిగూర్చి, ఎవ్వరేమాడుకొన్న నీకేమికొదువ, సతులనెమ్మోములకును సాటిజెప్పెదు కవుల నేస్తము ఉంగలవు" అని సమాధానపరచినాడు.

పూవుకన్నియ పృషదశ్వకుమారులకు కవి బొమ్మలపెండ్లిండ్లు గావించునాడు. విలాసపురుషుడు గదా!

తేనెతేనెల దలంపులు బ్రాకులాడ
పువ్వుపువ్వున వలపులు నిక్కలెల్ల
గొరిచిన మాల్యమువలె దూరమును నె,
అడిగా, కాశిచప్పుడు పోదునమ్మ-ఝమ్మ

అని తప్పునన్నాడు.

చెలువారన్ సురలెల్ల నాకధప
కుర్చీలందు గొల్వుండ బల్
మెలపుల్ మైంజగి సొంపుబాపి
సభవారిన్ రక్తిగట్టింతు ను
ద్దాలగా దెవ్వరు దపస్వరమ్ములను
పృథ్వీగోళ మూగించునే
ర్పులతో ధగ్గ మరొక్కనిన్ వెదకి
కీర్తుల్ వ్రాయు దిగ్భిత్తులన్.

ఎట్టి వర్ణనావైచిత్ర్యము, పోతన్నగారి "అల వైకుంఠపురంబులో" నను పద్యము శ్రీమహావిష్ణువు పూర్తిపరచిన దీనినెవ్వరు పూర్తిపరచిరో? అందుననే రవిగాననిచో కవిగాంచునే గదా యని పుట్టినది.

"పనిగొనకూరకే తిరుగుచాటొనరించుచు
మబ్బుగుత్తముల్
గొనగొనలాడగొట్టు తళుకుం
కొరడా మెఱపద్ది యా మహేం

ద్రునిదని యందు" నను వర్ణన యెట్టిస్వాభావికము బొందినది. నిజముగా మెరపు కొరడాయేగావచ్చును. లేకున్న తృటిలో మాయమగుటయేల? కాని యీసమయమున,

"మాఘలపు పంటకువచ్చిన
బిడ్డబిడ్డ రా
త్మ్రలను వగల్ రగుల్కొలిపి
మబ్బులమాటయి నారు నీకు దా
రుల నెవ్వడైన గన్పడుదురో
మము దల్చరో" అని కవి తనకోమలహృదయము చీటలువార పాతకుల కన్నుగవ చెమ్మగిల్లజేసినాడు.

తేటిబోటియందు హైందవసతీత్వము వెల్లివిరియుచున్నది.

"తూరుపు తెల్లవారినది దొంటిచెలీ
మునిమాపుదనక సం
చారము కంటి యాబిడవిచారము
దూరము వాడవాడ సిం
గారపు టుత్సవమ్ములు బికారి
మగండిక చాలు! యేల క
న్నీరొలికింతు వింతయు గణింపని
యీపెడ చెల్మినేతకున్."

ఇంతటి దురవస్థం బొందియుండిగూడి ప్రచండుడైన యునుని భార్యయగు పద్మిని గూడిన తనభర్తను తనతాళిబలముచే రక్షించుచున్నది.

కవి యాతడు. అతడు తనచుట్టున్న కవితామృతవాహిని నోలలార్చి అక్షరరూపమిచ్చి విఖ్యాతము చేయజాలును. అతనియెదుట "తెరవారిన యాకుజొంపముల్ మాతలుమానిమానిలి మగదభికృతి బైటపెట్టుమా!అని పూవుకన్నెకు హెచ్చరిక.

కాదె ప్రాయమ్మునందా? సౌఖ్యమ్ములు గట్టిపెట్టగల పంతమ్ముల్ నెపొసయ్యా, రాజా, సాధించెదవేమహారములు కొపాయమ్ముతో ననుబోట్ల కెట్టి" ఇట్టియెడ యెట్టిప్రాచ్యవర్ణనావిశేషము.

ముద్దులమూటంగట్టు నగుమోమున
దల్లి బయంటు దోయుచున్,
సద్దుదొరంగి రొమ్మునమ్ము
జలని చేతులు పాముచున్న యీ
నిద్దపు మేల్ కడాని పసినిగ్గుల
పన్నెలుదేరి యొచ్చునం
గ్రుద్దినలీల నిన్నె పరిగొన్న
మమారకమై చూడవే.

(గత వ[illegible]జి చూడుడు)

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad. Editor K. Balakrishna Reddy.

